# భగవద్గీత

[ బుర్రకథ ]

రచయిత

శ్రీ మూర్తి

ప్రకాశకులు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,

సంస్కృతాంధ్ర బుక్ డిపో (స్థా. 1882) రాజమండ్రి.

# భగవద్గీత

పరమ పావనికి భారతమాతకు
జేజే లనుడయ్యా

హాస్యం : ఆగరా సోదరా ! ఏమిటిది ? నీ కేమైనా మతి పోయిందా ఏం ?

కథ : ఏమిట్రా బాబూ నీ గొడవ ?

హాస్యం : ఇంకా యేమిటంటావేమిట్రా ఈవాళ ఇక్కడ మీ రేదో బుర్రకథ వెలగబెడతారని ఆశపడి యింతమందిజనం వచ్చికూర్చుంటే అప్పుడే జేజేలుకొట్టేసి తప్పుకుంటున్నా రేమిటి?

కథ : ఏడిశావ్లేగాని బుర్రకథే చెప్తున్నాం. అందు లోనూ చాలా పవిత్రమైన భగవద్గీతా సారాన్ని బుర్రకథగా చెప్పబోతున్నాం. వూరికే అల్లరిచేసి తన్నులుతినక శాంతంగా విను.

హాస్యం : అలాగయితే ప్రారంభించండి.

భారతపుత్రా వీనులవిందగు – చారిత్రము వినరా
కౌరవులకును మరి పాండవులకును – జరిగె పెద్దరణము భా॥
భారతయుద్ధం బనగానసమరమె – ప్రఖ్యాతినిగాంచె ,,
అందు పాండవుల పక్షపుముఖ్యుడు – అర్జునుండు బాబూ ,,
అస్త్రవిద్యలో వానిని మించిన – వీరుడు కనరాడు ,,
ఆ అర్జునునకు శ్రీకృష్ణుండే – రథసారథియయ్యె ,,
ఉత్సాహముతో నిద్దరుగూడా – యుద్ధభూమికేగి ,,
తమతమ శంఖము లూదిరిబాబూ – దిశలుపిక్కటిల్ల ,,

అతివేగముతో రథమా కౌరవ - సేన మధ్యకేగె భా॥
కృష్ణుండంతట అస్త్రాలొదలగ - కోరెను ఫల్గునుని ,,
పార్థుడొక్కపరి రణరంగమ్ము౯ను - పరికించాడండి ,,
ప్రతిపక్షంలో ఆప్తులనందర - బాగుగచూశాడు ,,
అంతటితోడనె నీరైపోయెను - అర్జునహృదయమ్ము ,,
యెత్తినవిల్లును ఒక్క దెబ్బలో - దించివేసినాడు ,,

హాస్యం : అదేమిట్రోయి ? అంత మహావీరుడన్నావు శత్రువుల్ని చూడగానే భయపడి విల్లుదింపేశాడా ?

కథ : కాదోయి వెర్రిమొహమా ! కారణమేమిటో యిప్పుడే తెలుస్తుంది, తొందరపడకుండా విను. యీ విధంగా యెక్కుపెట్టిన విల్లును దింపేసి విచారవదనంతో అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మతో యిలా అంటున్నాడు.

ఓ శ్రీకృష్ణా ! దయాంతరంగా ! - ఒక్కమాటవినుమా ఓ॥
యీరణభూమిని చూచి భయముతో-వణకుచుంటినేను ,,
యిచట నిల్చుటకు కూడ శక్తియే - చాలదయ్యానాకు ,,
అన్నిమూలలను ఆప్తబంధుగులె - అగపడుచున్నారు ,,
దేశికాగ్రణులు అన్నదమ్ములును - తాతలు కలరయ్యా ,,
వారలతోనే పోరాటమ్మును - జరపలేనునేను ,,
వారలందరును అస్తమించినచొ - ఏమున్నదినాకు ,,
అట్టిచో రణమున విజయమంది నే - సాధించెడిదేమి ,,
స్మశానమ్ము నే పరిపాలించగ - సమకట్టాలింక ,,
అందువల్లనీ రణమునుమానగ - సంకల్పించితిని ,,
దయతో నామొరవిని యుద్ధానికి - స్వస్తిచెప్పుమయ్యా ,,

హాస్యం : అదాసంగతి.

కథ : ఊఁ ! ఇలా చెప్పి అర్జునుడు తన గాండీవాన్ని క్రింద పెట్టి తనుకూడా రథంమీద విచారంగా కూర్చున్నాడు. దీనినే భగవద్గీతలో అర్జున విషాదయోగ మంటారు. అంతట కృష్ణ భగవానుడు భగవద్గీతాసారాన్ని ఫల్గుణునికి ఉపదేశించ నారంభించి ముందుగా సాంఖ్యయోగంలో యిలా చెప్పాడు.

గీతాసారము వినరా భారతి – వీరా శ్రద్ధగను
అస్త్రమ్ములనే పట్టుకు రణమున – కరుదెంచిన పిదప　　గీ॥
యుద్ధభూమిలో యీమమకారం – బెట్లువచ్చెనీకు　　,,
సాహసమెరుగని పిరికివాడవని – చాటును లోకమ్ము　　,,
ఆ అపకీర్తికి తావునొసంగక – గాండీవముబట్టి　　,,
పోరొనరింపుము పార్థావేగమె – పూనికతో నీవు　　,,

కథ : కృష్ణపరమాత్మ అర్జునుడ్ని యిలా కొంచెం చురుకు మాటలతో ఉత్తేజపరచడానికి ప్రయత్నించాడు. అయితే అప్పుడు అర్జునుడు కృష్ణుతో “ బావా! యెందుకు నన్నిలా శ్రమపెడతావు. బంధువుల్నీ, స్నేహితుల్నీ చంపి రాజ్యాధికారం వశంపరచుకు బ్రతకడంకన్నా యెక్కడైనా ముష్టెత్తుకొనడం మంచిదికాదా ? ” అన్నాడు. అంతట కృష్ణభగవాను డేమన్నాడయ్యా :

బిచ్చమెత్తుకొని బ్రతికెదనంచును – పిరికిమాటలేల　　గీ॥
క్షాత్రవంశముకు తగదోయ్ బిచ్చం – బెత్తెడికార్యమ్ము　　,,
ధర్మాధర్మములను యోచించుకు – తగినరీతిగాను　　,,
నడచుకొనుటయె అన్నివిధములా – సర్వోత్తమమయ్యా　　,,
అని శ్రీకృష్ణుడు పల్కుటతోడనె – అర్జునుడాతనిని　　,,
రణమొనరించుటో బిచ్చమెత్తుటో – యేదితనకు తగునో　　,,

తెలపగ ప్రార్థన చేశాడండి - నిండు మనసుతోడ గీ॥
పార్థునితోనిటు కృష్ణుండంటాడు - పలికినాడు బాబూ ,,
అర్జునవినుమా ! దేహికి దేహ - మ్మునకును గలతేడా ,,
తెలిసినవారలు యీ విధమ్ముగా - విచారింపబోరు ,,
బాల్యము యౌవనము వార్ధక్యమ్మును - వచ్చిపోవునటులె ,,
మరణముకూడా తప్పక వచ్చును - ప్రతీదేహమునకు ,,
అయితే నీవును నేనను భేదం - ఏర్పడియుండుటచే ,,
మమకారమ్మది యింద్రియాలలో - విషయమ్ములదగిలి ,,
సుఖదుఃఖమ్ములకలుగగ చేయును - సతతము మనుజులకు ,,
కావున వాటిని తెగులుకొనక నే - మోక్షమందవలయు ,,
పోతే ఆత్మను గూర్చిన సత్యము - తెలిపెదవినుమయ్యా ,,
అన్నిటిలో నీ యాత్మయన్నదే - శాశ్వతమ్ముసుమ్మా ,,
దానిని చంపెడి వారలెవ్వరును - లేరెచ్చటగూడా ,,
యిక చచ్చెడిదీ శరీరమొకటే - శ్రద్ధగవినుమయ్యా ,,
మాసినవస్త్రాల్ మనమేరీతిని - విడిచివేయగలమొ ,,
ఆత్మయట్టులే శరీరమ్ములను - మార్చుకొనుచునుండు ,,
యింకా ఆత్మకు చెందిన ఘనతను - చెప్పెద వినుపార్థా ,,
పంచభూతములు కూడా ఆత్మను - యేమిచేయలేవు ,,
ఇంద్రియమ్ములవి ఆత్మయెట్టిదో - యెరగలేవుసుమ్మా ,,
కానిఆత్మ దౌతత్వమనుభవ - మున నెరుంగవచ్చు ,,

కథ : ఇలాబోధించి యింకా కృష్ణుడేమంటున్నాడయ్యా " పార్థా ! ఆత్మయొక్క అనుభవాన్నిబట్టి అయినా నీవు తప్పని సరిగా యుద్ధం చెయ్యాలి అన్నాడు.

హాస్యం : చెయ్యాలి అంటే యెందుకు చెయ్యాలన్నాడోయ్.

కథ : అది కృష్ణపరమాత్మ అర్జునుడుతో చెప్పుతు న్నాడు విను.

గీతాసారము విన్నను
పాపపరంపరలంటవు
ఖ్యాతకులజునకు యుద్ధమె గీ॥
సద్గోత్రమనహా ధర్మము ,,
సంగరమ్ములో గెల్చిన ,,
భోగభాగ్యముల్ కలుగును ,,
అట్లుగాక మరణించినన్ ,,
వీరస్వర్గము దక్కును ,,
అయితే ఒక్కటియున్నది ,,
లాభ మొచ్చినా నష్ట మొచ్చినా ,,
సుఖముకల్గినన్ దుఃఖ మొచ్చినా ,,
సమయమని యెంచుటముఖ్యము ,,
యిట్లుఫలమ్మును కోరక ,,
యుద్ధంసేయుట సెల్లును ,,

కథ : ఇంకా యేమంటున్నాడయ్యా కృష్ణపరమాత్మ.

కర్మయోగమును జ్ఞానయోగమును–సమానమ్మెపార్ధా గీ॥
ప్రతిఫలమ్మునే కోరకకర్మను – చేయుచున్నయెడల ,,
మనసు నిలకడగ నుండుననునది – పరమసత్యమోయి ,,
మతికి స్థిరత్వంలేనిచో పతనం – కల్గితీరుపార్ధా ,,
కావున యోగాభ్యాసముతో మతి –నిల్పుకొనగవలయు ,,
అదియెట్లన్నను చెప్పెదవినుమా – పార్ధాశ్రద్ధగను ,,
విషయాలోచనవల్లనే విషయా – సక్తికలుగుచుండు ,,
విషయాసక్తిచే కలుగుకోరికలు – ఆ కోర్కెలవలెనే ,,

మానవునకును కోపమ్ముకలుగునా–కోపముమూలమునే గీ॥
వచ్చితీరు మోహమ్ముదానిచే – విస్మృతికల్గెడిని ,,
విస్మృతివల్లనె బుద్ధినశించును – బుద్ధినశించినచో ,,
సర్వముకూడా నశించినట్లే – గానపతనమునకు ,,
అన్నివిధముల విషయాలోచన – మూలమోయిపార్థా ,,
మనోనిబ్బరము కలిగినవ్యక్తిని – క్రోధమంటలేదు ,,
మోహమన్నదా జ్ఞానిదగ్గరకె – చేరలేదుసుమ్మి ,,
దీనినె బ్రాహ్మీస్థితియని యందురు–యీస్థితి పొందినచో ,,
మానవునకు మోక్షమ్ముతప్పకను – కల్గితీరునయ్యా ,,

కథ : అంటూ సాంఖ్యయోగాన్ని గురించి వివరించాడు కృష్ణపరమాత్మ.

హాస్యం : దానితో అర్జునుడు సంతృప్తిపడి యుద్ధం ప్రారంభించాడా ?

కథ : లేదు. అప్పుడేఅయిందా. సాంఖ్యయోగవివరణ అయిన తర్వాత కృష్ణపరమాత్మ అర్జునునికి కర్మయోగాన్ని గురించి యిలా తెలిపాడు.

జ్ఞానకర్మముల యందున సై॥
ఏదిగొప్పదని యడిగిన ,,
కర్మముచేయక యున్నను ,,
జ్ఞానమన్నదే కలుగదూ ,,
లోకములో ప్రతివ్యక్తియూ ,,
ప్రకృతి ఆధారమ్ముగా ,,
కర్మమ్ములనే చేయును ,,
కర్మలుచేయుట యందున ,,

జ్ఞానియు మూర్ఖుడు నొక్కటే సై॥
అయితే లక్ష్యములందున ,,
తేడాలుండును అర్జునా ,,
కర్మలు చేసెడి నప్పుడూ ,,
జ్ఞానిబలముతో తనవగు ,,
జ్ఞానేంద్రియము కట్టుకు ,,
కోరికలన్నవి లేకను ,,
కర్మమ్ములనే చేయును ,,
ముక్తికిసతడే అర్హుడూ ,,
పోతేమూర్ఖుడు కోర్కెలన్ ,,
మిక్కుటంబుగా కోరుచూ ,,
సేయువాటికై కర్మలు ,,

కథ : ఈమాదిరిగా వివరించి కృష్ణుడింకా ఫల్గునునితో “పార్థా! ఇదివరలో పెద్దలందరూ జ్ఞానులవలెనే ప్రవర్తించి ముక్తిపొందారు. పెద్దలు యెలాచేస్తే చిన్నవాళ్లుకూడా అలాగే చేయడం ధర్మం. అందులోనూ జనసామాన్యంయొక్క శ్రేయస్సునుకోరి కర్మలు చేయడం మరింత ధర్మం. ఇక యిక్కడ నీ ధర్మం ఏమిటంటే యుద్ధంలో శత్రువుల్ని హతమార్చడం రాజధర్మం. అదే నీకు వర్తిస్తుంది” అన్నాడు. అంతట అర్జునుడు శ్రీకృష్ణునితో “కృష్ణా! ప్రతిఫలాన్ని ఆశించకుండా కర్మలు చెయ్యాలని యెంత తాపత్రయపడినా లాభంలేకుండా యిష్టం లేని పాపాలు చేయాల్సివస్తోంది. కారణమేమిటి?” అని ప్రశ్నించగా పరమాత్మ ఏమన్నాడయ్యా :

మితములేకనే కోరికయన్నది – కోపముగామారు గీ॥
ముక్తికియ్యదియె బద్ధవైరిగా – మసలుచుండు నెపుడు ,,
జ్ఞానమ్మును తనమాయచేనియ్యది – కప్పిపుచ్చుచుండు ,,
కావున జ్ఞానిగ నుండగోరువా – డనవరతముగూడా ,,
అతిజాగ్రత్తగ కోర్కెలన్నిటిని – అణచుకొనగవలయు ,,
కర్మయోగమన నిదియెపార్థా – మరువబోకుమయ్యా ,,

హాస్యం : కర్మయోగాన్ని గురించి యిలా చెప్పా డంటావు కృష్ణపరమాత్మ.

కథ : అవును. అయితే అప్పుడు ఫల్గునుడేమని ప్రశ్న వేశాడయ్యా "ఓ బావా! ఇప్పుడు నీవు నాకుపదేశించే యోగాలను ప్రత్యేకంగా ఇప్పుడే నాకోసం సృష్టించావా? లేక యింతకుముందే యెవరికైనా తెలిపావా?" అని అడిగాడు. దానికి కృష్ణభగవానుడిలా అన్నాడు.

అందరికన్నను ముందుగ నేనిద – అతిజాగ్రత్తగను గీ॥
ఉపదేశించితి నాదిత్యునకా – పిమ్మట నాతండు ,,
మనువు కెంతయొ నుత్సాహముతో–బోధించెను పార్థా ,,
ఈరీతిగ నది క్రమక్రమముగా – మునులకు ప్రాకింది ,,
అయితే యెపుడో తెల్పుటచే నిది – మరుగైపోయినది ,,
తిరిగి నీకు నే నీదినమ్మునను – తెల్పుచుంటినయ్యా ,,
అని శ్రీకృష్ణుండు ఫల్గునునకు తా – చెప్పిన పార్థుండు ,,
అడిగెను కృష్ణుని యీరీతిగ తన – సందేహముతీర ,,
నీవు యిటీవలె పుట్టితికాదా – సూర్యునకేరీతిన్ ,,
తెలిపినాడవీ యోగక్రమమును – తెలుపుమయ్య కృష్ణా ,,
అంతట కృష్ణుడు నవ్వుచు నాతని – కీరీతిగ చెప్పె ,,
మనమందరమును పెక్కుజన్మముల–నెత్తినారమయ్యా ,,

అయితే పూర్వపు జన్మములసంగతి – తెలియదు నీకేమి గీ॥
కాని అవన్నియు సంపూర్ణముగా – తెల్సునయ్యా నాకు ,,
ఏమని యడిగిన మానవమాత్రుడ – వుగ పుట్టెదవీవు ,,
నేనుమాత్ర మటుగాకను ధర్మము–నిల్పు సమయమందు ,,
మానవజన్మతో నీలోకమ్మున – నవతరించుచుందు ,,
చెడ్డవారలను శిక్షించుటయును – సుజనుల గాచుటయు ,,
కర్తవ్యము నాకీజన్మమ్మున – శ్రద్ధగవినుమయ్యా ,,
నేనొనరించెడి కార్యములందలి – తత్వంబెరిగినచో ,,
మానవజన్మము లేకనే నరులు – ముక్తినందగలరు ,,

కథ : అని చెప్పి యింకా యేమన్నాడంటే.

కర్మల నాధారమ్ముగా సై॥
మానవజాతికి అంతకూ ,,
నాల్గుకులాలను పెట్టితి ,,
వారలె బ్రాహ్మణ క్షత్రియుల్ ,,
వైశ్యులు శూద్రులు వింటివా ,,
చేసినతప్పుకు శిక్షలన్ ,,
వేసెడి సమయమ్మందు నే ,,
న్యాయమూర్తిగా నుందును ,,
కాని అందుభేదాలకు ,,
కర్తనుమాత్రము కాబోను ,,
ప్రతిఫలమేమియు కోరక ,,
నేను కర్మములు చేతును ,,
కావున నీవును అర్జునా ,,
ప్రతిఫలమ్మనే కోరక ,,

నీకర్మలనే చేయుచు సై
ఇంకొకసంగతి వినుమయా ,,
కర్మలకన్నను యాగమే ,,
ఘనమేమోయని యెంచిన ,,
అగ్నిగుండముల తోడను ,,
యాగముచేయుట చాలదు ,,
హృదయములోగల వెలుతురే ,,
బ్రహ్మమటంచును తెలియునయా ,,
యాగకర్తలలోకూడా ,,
తారతమ్యములు కలవయా ,,
కోర్కెలకోసము ఆశతో ,,
దేవతల్ని బహుశ్రద్ధతో ,,
కొల్తురు కొందరు యింకను ,,
కొందరు తమదా ఆత్మనే ,,
ఆహుతిచేతురు అగ్నికి ,,
పోతే జ్ఞానేంద్రియములన్ ,,
నిగ్రహ మని యెడి అగ్నిలో ,,
కాల్తురుకొందరు దీక్షతో ,,

కథ : ఇంకా యిలా అన్నాడు కృష్ణపరమాత్మ. "అర్జునా ! శాస్త్రాలను ప్రతినిత్యం పారాయణచేసేవారూ, నియమనిష్టలతో తపస్సు సాగించేవారూ, నిరంతరం తమకు కల్గినదానిలో కొంత దానంచేసేవారూ పుణ్యాత్ములనబడతారు. దీనినిబట్టి చూస్తే జ్ఞానయోగంకూడా కర్మలకు బలమిస్తాయి" అంటూ యింకా యేమి చెప్పాడంటే :

జ్ఞానముకన్నను మిన్నయైనదీ - జగతిలోనలేదు　　గీ॥
కావున జ్ఞానార్జనము కోసమై - తగిన గురునిచేరి　　,,
శ్రోత్రవిషయములనన్నియు వేగమె - గ్రహియింపుమునీవు ,,
పాపకర్మములు సర్వముజ్ఞానము - వల్ల తొలగిపోవు　　,,
జ్ఞానముతో నీ సందేహాలను - త్రుంచిత్రక్షణమ్మె　　,,
యుద్ధముసేయగ లేవోయ్‌పార్థా - సర్వోత్తమమదియె ,,

హాస్యం : అబ్బబ్బ ! ఆగంట్రా ! ఇదంతా ఏదో గందర గోళంగావుంది. ఇంతకూ కృష్ణపరమాత్మ కర్మచేయాలంటాడా! అక్కరలేదంటాడా ? ఒక్కముక్కలో చెపుదురు చంపక.

కథ : ఏడిశావులేగాని ఆ ప్రశ్న అర్జునుడే శ్రీకృష్ణుడ్ని అడిగాడు.

హాస్యం : అడిగాడా ? చూచావామరి నేను తెలివి తక్కువవాడ్ని అంటారు మీరంతా. అర్జునుడిబుర్ర మనబుర్ర ఒకటేనన్నమాట.

కథ : అవునులే నీగొప్ప నువ్వే చెప్పుకోవాలి గాని దానికి కృష్ణభగవాను డేమన్నాడో విను.

హాస్యం : చెప్పండి.

శ్రద్ధమీరగ గీత చదివినను విన్నను
　　జన్మమ్ము తరియించు తథ్యంబయా
సన్యాసముతో కర్మయోగమ్ముకూడాను
　　సమమే ననెడిమాట నిక్కంబయా శ్ర॥
ప్రతిఫలాపేక్షయే లేకుండకర్మలను
　　కర్మయోగులు ఆచరిస్తారయా　　,,
జ్ఞానికిని మూఢునకు కర్మలొనరించేటి
　　కార్యమ్ములో భేదమున్నాదయా　　,,

కాని జ్ఞానముతోడ వెలుగొందు మానవుడు
భారమ్మునాపైన వేస్తాడయా ,,
యీశరీరపు ధర్మములు కర్మలంచును
ఆతడెప్పుడు మదిని తలచేనయా ,,
అన్నిప్రాణులగూడ అమితాదరమ్ముతో
ఆతడెప్పుడుకూడ చూస్తాడయా ,,
అన్నిప్రాణులయందు నాపరబ్రహ్మమె
జ్ఞానికంటికి కానవస్తుందయా ,,
కోరికను కోపాన్ని దరిచేరనీకుండ
అతడు జాగ్రత్తనే పడతాడయా ,,
ఎల్లెడల యెల్లపుడు నాస్వరూపమ్మనే
లోలోనగని సంతసిస్తాడయా ,,

కథ : అని చెప్పి కర్మసన్యాసయోగాన్ని సమాప్తి చేశాడు కృష్ణభగవానుడు.

హాస్యం : రానున్న యోగమేమిట్రా ?

కథ : ఆత్మసంయమ యోగం. కృష్ణ పరమాత్మ పైవిధంగా చెప్పినతర్వాత పార్థుడిలా అన్నాడు.

పద్యం : తరచిచూడంగ సన్యాసధర్మ మొకటె
అన్నివిధముల నుత్తమమనుచునాకు
దోచెడిని కృష్ణరణమును త్రుంచియింక
యోగ మభ్యాసమొనరింతు బాగుగాను.

కథ : అంతట శ్రీకృష్ణుడు అర్జునునితో యేమంటు న్నాడయా.

పద్యం : జన్మమెత్తిన యందుకు స్వార్థరహిత
సేవచేయుట నరునకు చెల్లునయ్య
అట్లుగాకుండ కాషాయిబట్టగట్టి
మూలకూర్చొన సోమరిపోతువంద్రు

హాస్యం : అచ్ఛా! సరైనమాట చెప్పాడురా.

కథ : పోతే సన్యాసికి వుండవలసిన లక్షణాలను గురించి కృష్ణపరమాత్మ యిలా అన్నాడు.

సన్యాసికి కావలసిన గుణములు- తెలియుమోయిపార్థా గీ॥
ప్రాణికోటి కష్టాలను గాంచిన - బాధకలగవలయు ,,
మనస్ఫూర్తిగా తనకువీలగు - సేవచేయవలెను ,,
కోర్కెలులేకను ఆత్మజ్ఞానముతో - కర్మలుజరప ,,
కామక్రోధాల్ లోభమోహముల్ - వానినంటబోవు ,,
వాని మనమ్మది వానికెప్పుడును- లొంగియుండునయ్య ,,
కావున మనసే శత్రువు మిత్రుడు - మానవమాత్రునకు ,,
మనసును గెల్చిన నరుడీ జగమున - సౌఖ్యమందగలడు ,,
ఆతడన్నిటిని కూడా సమముగ - పరిశీలిస్తాడు ,,
కష్టసుఖమ్ములు రెండునువానికి - సమానమెపార్థా ,,
అట్టి మహత్తరయోగివి కావలె-నని నీవెంచినచో ,,
యోగాభ్యాసము జరుపుకొనుమయా-క్రమముతప్పకుండా,,

హాస్యం : క్రమం తప్పకుండా అంటే దానికేదైనా నియమం నిబంధనా లున్నాయేమిట్రా ?

కథ : వున్నాయికనకనే అలా అన్నాడు. ఆ క్రమం యేమిటోకూడా కృష్ణ పరమాత్మ అర్జునునికి చెపుతున్నాడు. జాగ్రత్తగా విను. ముందుముందు నీకు పనికొస్తోందేమో.

హాస్యం : అయితే కానీ.

జనసంచారము లేకను సై॥
యుండు ప్రశాంతపుస్థలమున ,,
దర్భాసనమును వేసుకు ,,
కృష్ణాజినమును పరుచుకు ,,
తెల్లవస్త్రమే వేసుకు ,,
కూర్చొనగావలె దానిపై ,,
పిమ్మట కన్నులు మూసుకు ,,
మనసును స్థిరముగ నుంచియె ,,
యోగవిద్యకే దిగవలె ,,
బ్రహ్మచర్యమును విడవక ,,
మితమగు హారమె తినుచును ,,
కొద్ది సమయమె నిద్రపోవుచు ,,
యోగవిద్యనే నేర్చిన ,,
యెంతో సౌఖ్యము కలుగును ,,
యీవిధమ్ముగా విద్యను ,,
నేర్చినట్టి యోగీంద్రుడు ,,
ఆత్మలో భూతాల్ చూచును ,,
భూతమ్ములలో నాత్మనే ,,
చూచితీరు నతడెప్పుడూ ,,

హాస్యం: అబ్బో! చాలా నియమాలున్నాయిరా.

కథ: మరేమిటి! డచ్చాలు కొట్టడ మనుకుంటున్నావేమిటి? సరే కృష్ణపరమాత్మ యిలా చెప్పినతర్వాత అర్జునుడతనితో "కృష్ణా! నా మనస్సు నిరంతరం చలించిపోతున్నదిగాని స్థిరంగా వుండడంలేదు. యోగాభ్యాసం జరపడానికి మనస్సునెలా స్థిరంగా వుంచుకోవచ్చో తెలపవా! అన్నాడు. అంతట శ్రీకృష్ణుడేమన్నాడో విన్నావా?

గీతాసారము విన్నను
పాపపరంపరలంటవు
విషయమ్ముల వైరాగ్యము గీ॥
పూనుటచేతను నిత్యమూ ,,
అభ్యాసమ్మొనరించుటన్ ,,
మనసు నిల్పుకొనవచ్చును ,,
అయితే పూర్తిగ మనసును ,,
నిలుపుశక్తి లోపించినన్ ,,
ఆ అభ్యాసపు సత్ఫలం ,,
నాకమునందున దక్కును ,,
ఆపై ధనికులయింటనో ,,
లేక మునీంద్రుల యింటనో ,,
పుట్టును తప్పక నాతడు ,,
అయితే ధనికులయింటిలో ,,
కన్నను యోగుల యింటిలో ,,
పుట్టుటె సర్వోత్తమమయా ,,
యేమన పూర్వపు యోగమున్ ,,
కొనసాగించును ఆతడు ,,
పార్థా వినుమా యిద్దియే ,,
ఆత్మసంయమపు యోగము ,,

హాస్యం : ఏమిత్రూ! పూరికే యోగాలు చెప్పకు పోతున్నావు. అసలు యెన్ని యోగాలేమిటి ?

కథ : మొత్తం పద్దెనిమిది. ఇప్పటికి ఆరు పూర్తి అయ్యాయి. ఏడవది విజ్ఞానయోగం.

హాస్యం : ఏం? నిద్రవస్తోందేమిట్రా, అంత నీరసంగా చెప్తున్నారు. తొందరగా కానీయండి.

కథ : అసలు నీకు నిద్రొస్తున్నట్లుంది.

హాస్యం : లేదు చెప్పండోయ్.

కథ : కృష్ణ పరమాత్మ అర్జునునకు విజ్ఞానయోగాన్ని యెలా బోధించాడయ్యా :

నాదు మాయచె జనులు మోహమ్ములోబడి
జ్ఞానమ్మెరుంగ లేరొ అర్జునా ॥శ్రీ॥
పంచభూతమ్ములును ఆ మాయ యనుమాట
ముమ్మాటికినికూడ సత్యంబయా ,,
ఇపుడున్న ప్రకృతిలొ మలినమ్ము శుద్ధమను
రెండురకములు వేరె వున్నాయయా ,,
యీ ప్రకృతిని నేను ఆధారముగ బట్టి
సృష్టిచేయుచునుంటి నిక్కంబయా ,,
పావనమ్ముగా నెంచబడి యేటివేదాల
ఓంకార రూపాన్ని నేనేనయా ,,
అన్నిప్రాణులలోని జీవాలలోన గల
సారాన్ని పూర్తిగ నేనేనయా ,,
గగనమ్మునందుండు రవిచంద్రదీపాల
లోని వెలుతురుకూడ నేనేనయా ,,
యింతియెగాకుండ చెడుగుణాలకుకూడ
ఆధారభూతుండ నేనేనయా ,,
నా మాయలోబడియె దుష్టాత్ము లెల్లరును
పతనస్థితికి జారిపోతారయా ,,

కథ : ఇంకా కృష్ణపరమాత్మ యిలా అన్నాడు. అర్జునా! జ్ఞానులూ, జిజ్ఞాసువులూ, అర్థార్థులూ, ఆర్యులూ కూడా నన్ను ప్రార్థిస్తారు. అయితే యిందులో తేడాలున్నాయి. సర్వమూ నేనేనని విశ్వసించి నన్ను ప్రార్థించేవారు జ్ఞానులు. అలా కాకుండా చిన్నవాళ్లు యెవరో చిల్లర దైవాల్ని పూజిస్తారు. పోతే అజ్ఞానులు నన్ను తమ కోరికలు నెరవేరడంకోసం ప్రార్థిస్తారు. మరొకవిషయ మేమంటే నన్ను పూజించేవారు బ్రహ్మం, అధ్యాత్మకం, కర్మ, అధిభూతం, అధిదైవతం, అధియజ్ఞం అనేవాటిని గురించే తెల్సుకోనగలరు. అంతేగాక చనిపోయేటప్పుడు నన్ను ప్రార్థిస్తే కష్టపడకుండా మరణాన్ని పొందుతారు అన్నాడు విజ్ఞానయోగంలో.

హాస్యం : ఆగరా బాబూ! నాకేదో అయోమయంగా వుంది. యిదంతా బ్రహ్మమంటావు, అధ్యాత్మమంటావు, ఇవన్నీ మనమెప్పుడూ కనీసం చెవులతో విననైనా వినలేదు.

కథ : ఇప్పుడు వింటున్నావుగా. వాటి అర్థాలుకూడా కృష్ణపరమాత్మ చెపుతున్నాడు విను.

హాస్యం : నాతో నే!

కథ : ఏడిశావు. వినవోయ్.

శ్రద్ధగవినుమా అర్జునా సై
అక్షరమైనది బ్రహ్మము ,,
ప్రత్యగాత్మపు భావమే ,,
ఆధ్యాత్మమ్మనబడునయా ,,
సృష్టికార్యమును అర్జునా ,,
కర్మమటంచును పిల్తురు ,,

పతనమయ్యేడిదానినే సై
అధిభూతమ్మని యందురు ,,
అధిదైవతమన జీవుడే ,,
అధియజ్ఞుండను నేనయా ,,

కథ : కృష్ణభగవానుడిలా చెప్పాక అర్జునుడు యేమని అడిగాడయ్యా అంటే,

ఓ శ్రీకృష్ణా దయాంతరంగా – ఒక్కమాట వినుమా ఓ॥
అవసానపు కాలమ్మున నిన్నే – ప్రార్థన చేసినచో ,,
కలిగెడిదేమిటో తెలియచెప్పుమా – తేటతెల్లముగను ,,
నినుదలచుటకును మోక్షమందుటకు–లంకెయేమిటయ్యా ,,

కథ : దానికి శ్రీకృష్ణుడిలా అన్నాడు,

మరణకాలమున నను ప్రార్థించిన – మానవులందరును గీ॥
తమమనసులలో యేమనితలంతురో–అవియన్నియుజరుగు,,
ముందేజన్మము కావలెనందురో – ఆజన్మమెవచ్చు ,,
అయితే మరణం వచ్చేదెప్పుడో–ముందు తెలియదయ్యా,,
అందువల్లనే అనవరతము నను – ప్రార్థించగవలయు ,,
నే విశ్వమ్మున కధినాథుండను – సనాతనుడగూడా ,,
యెట్టివారలకు నైనను పతనం – తప్పబోదుగాని ,,
నా కటువంటిది యెన్నడుకూడా–ప్రాప్తించదు సుమ్ము ,,
ఇంతవాడనై యుండియుకూడా – నిశ్చల భక్తులకు ,,
లొంగియుండెదను నిశ్చయముగనే–నమ్ముము నామాట ,,
కావున నీవు నాపై నిర్మల–భక్తి గలిగియుండి ,,
యుద్ధముసేయగ లేవోయ్ పార్థా – సంశయించకుండా ,,

హాస్యం : ఇదేం యోగంరా బ్రదర్ ?

కథ : దీనిని అక్షర పరబ్రహ్మయోగమంటారు. తర్వాత చెప్పబోయేది రాజవిద్యారాజగుహ్యాయోగం.

హాస్యం : అమ్మయ్యో ! ఇదేవో చాలా గాబరాపెట్టేలా వుంది. పేరే నోరు తిరగడంలేదు.

కథ : సాచి దవడమీదకొడితే అదే తిరుగుతుందిలేగాని అల్లరిచెయ్యకు.

అర్జునా వినుమయ్యా బ్రహ్మవిద్యను నీవు
అభ్యసించుటకెంతో సులువయ్యా　　బ్రశ॥
అంతియెగాక నిది ప్రత్యక్షముగ ఫలం
బిచ్చు నను నామాట సత్యంబయ్యా　　,,
యీలోకమంతయును పూర్తిగా నావలనె
నిండి యీరీతిగా నున్నాదయ్యా　　,,
పుట్టించుటకును మరి గట్టించుటకుగూడ
ఆధారభూతుండ నేనేనయ్యా　　,,
యింద్రియాలకు మాత్రమే క్షణమ్మునగూడ
నేరూపమున కానరాబోనయ్యా　　,,
నేను లేనని పల్కు పాపాత్ములందరున్
నామాయచే బాధపడతారయ్యా　　,,
ఆరీతిగాకుండ ప్రాజ్ఞులెల్లరు నన్ను
నిరతమ్ము ప్రార్థనము చేస్తారయ్యా
యీ విశ్వమునకే నే తల్లినీ తండ్రినీ
నేనేను సర్వమ్ము నిక్కంబయ్యా　　,,
ఎవరి శక్తినిబట్టి వారు పూవో పండో
అందచేస్తే సంతసిస్తానయ్యా　　,,
కులతత్వ భేదమ్ము గోరంతయునుగూడ
నాకు లేదనుమాట సత్యంబయ్యా　　,,

స్త్రీపురుష భేదమ్ముతో నసలె పని లేదు
నా కందరునుకూడ సమ మేనయా క్రి॥
గాన తప్పక నీదుమనసు నాపైనుంచి
నీవు నన్నే పూజ చేయాలయా ,,

కథ : అని బోధచేశాడు కృష్ణపరమాత్మ. ఇంకా విభూతియోగంలో శ్రీకృష్ణుడు ఫల్గునునికి యేమి ఉపదేశం గావిస్తున్నాడంటే :

వింటివె అర్జున యింతవరకు నే – తెల్పిన విషయములు గీ॥
నాదుఘనతినా దేవతలై నను – యెరగరు పూర్తిగను ,,
నను ప్రార్థించినవారికి తప్పక – సద్గుణాల నిత్తు ,,
లేనివారలను చెడ్డగుణములే – పీడించుచునుండు ,,
అని యీరీతిగ కృష్ణుడు తెల్పిన – ధనంజయుడపుడు ,,
అడిగినాడయా నిండు మనస్సుతో – ఆ శ్రీకృష్ణుడిన్ని ,,

హాస్యం : ఆఅడిగిందేమిటో చెప్పరాబాబూ.

కథ : అదుగో ఆతొందరే వద్దన్నాను.

ఓ శ్రీకృష్ణా దయాంతరంగా – ఒక్కమాట వినుమా
మునుపు మునీంద్రులు మహానుభావులు–నీఘనతనుగూర్చి ఓ॥
యెన్నొవిధముల చాటినారయా – యీలోకమ్మునకు ,,
వారలందరును తెల్పినరీతినె – యిపుడు పల్కితీవు ,,
మరియొకపరి నీ మహాత్యమ్మువిన – కోర్కెగలైనాకు ,,
దయతో ఆత్మవిభూతి తెలుపుమా–మది సంతసమంద ,,

కథ : ఈవిధంగా అర్జునుడు అడగగానే కృష్ణభగవానుడు యిలా చెప్పాడు :

పార్థా వినుమా నాదు చరితాన్ని నీవు
పొందగలవోయ్ ముక్తి మార్గాన్ని
వేదాలలో సామవేదాన్నోయ్ నే
దేవతలలో నింద్రదేవుడ్నోయ్ పా॥

రుద్రులలో శంకరుడ్నోయీ
మాటల్లో ఓంకార శబ్దాన్నోయ్ పా॥
నక్షత్రమాలలో చంద్రుడ్నోయ్
జ్యోతిరూపుల్లోన సూర్యుడ్నోయ్ ,,
ద్వాదశాదిత్యుల్లో విష్ణువున్నోయ్
దేవపురుషులలో నారదుడ్నోయీ ,,
నదులన్నిటిలో గంగ నేనేనోయ్
ఆవుల్లో కామధేనువునోయీ ,,
మోసాలలో జూదమును నేనోయ్
మరణమ్ముకూడాను నేనేనోయ్ ,,

కథ : ఇలా తననుగురించి చెపుతూ యింకా వాక్కు, బుద్ధి. ధైర్యం, స్మృతి, లక్ష్మి, కీర్తి, ఓరిమి అనేవి తన రూపాలనికూడా కృష్ణభగవానుడు తెలిపిచ్చాడు. అంతట అర్జునుడేమన్నాడయ్యా, "కృష్ణా! జూదానివికూడా నువ్వేనా? అయితే ఏ పాపమూ యెరుగని మాచేత నువ్వే జూదమాడించి యిలా తయారుచేశావన్నమాట" అన్నాడు. అప్పుడు కృష్ణపరమాత్మ నవ్వుతూ "వెర్రివాడా! మీ కష్టాలకు నేను కారకుడ్నికాను. మీ కర్మను బట్టి ఈ స్థితికివచ్చారు. నన్నుగురించి మరో విషయం కూడా తెల్సుకో. యాదవుల్లో కృష్ణుడ్ని, పాండవుల్లో పార్థుడ్నికూడా నేనే" అంతట పార్థుడు మనమిద్దరం ఒకటెలా అవుతాము?" అని అడిగాడు. దానికి కృష్ణ పరమాత్మ :

చెప్పెద వినుమా అర్జునా సై
నేనీ భూలోకమ్మునన్ ,,
ఒకపాదమె నిల్పితిన్ ,,
మనదు ఉపాధులు రెండునూ ,,
విడిచిన నిద్దర మొక్కటే ,,
ఆత్మ మనిద్దరిలోనను ,,
ఒక్కటెయున్నది తెలియుమా ,,
యిదియె విభూతీయోగము ,,

హాస్యం : ఓరినీ విభూతియోగమంటే యిదా! ఇంకా మొహానికి విభూతి పూసుకోనడ మెలాగో చెప్పే యోగమనుకున్నాను.

కథ : అవునులే. అంత తెలివితేటలున్నాయి మనకి.

హాస్యం : మన తెలివితేకేమోయి రాజాలాంటిది. కుర్రించే తాహతుకల వాళ్లు కరువైపోయారుగాని.

కథ : పరేలే. కథవిను! కృష్ణభగవానుడిలా అన్న తర్వాత అర్జునుడాయనతో యేమన్నాడయ్యా :

నీ యుపదేశమునంతయు శ్రద్ధగ - వింటిని శ్రీకృష్ణా గీ॥
వినుటతోడనే సంతసమ్ముతో - నామది పొంగినది ,,
సందేహమ్ములు సంశయమ్ములును-సడలిపోయినాయి ,,
కానియొక్కటే కోరికనాలో - నుబుకెత్తుచునుండె ,,
నీ సంపూర్ణ స్వరూప దర్శనం-బునకు నాదు మనసు ,,
ఉత్సాహముతో నెనోన్నివిధముల - ఉవ్విళ్లూరెడివి ,,
గావున దయతో నొకపరి దానిని-చూపవయ్యకృష్ణా ,,
అని యా ఫల్గును డడుగుటతోడనె - కృష్ణుండనెనిట్లు ,,
నీదుకోరికను తప్పక తీర్చెద - నయితే ఓపార్థా ,,
యీనీమామూల్ కన్నులతో నను-గాంచలేవు నీవు ,,
దివ్యదృష్టినే యిచ్చెద దానితో- చూడుమయ్యనన్న ,,
అని పలుకుచునే కృష్ణుడు వానికి - దివ్యదృష్టినిచ్చె ,,

కథ : అప్పుడు యేంజరిగిందయ్యా!

దివ్యదృష్టినిపొంది పార్థుడప్పుడు విశ్వ
రూపమ్ము ప్రీతితో చూశాడయా శ్రీ॥
పీతాంబరాలతో మణిహారములతోను
పూర్ణపురుషుడు కానిపించాడయా ,,
ముల్లోకములుగూడ వానిరూపములోనె
మూర్తీభవించాయి తెలియండయా ,,

పెక్కువదనాలతో పెక్కు చేతులతోను
మరిపెక్కు నేత్రాలతో శ్రీ॥
అలరారు నా రూపమందెందరో మునుల్
ఆసీనులై యుండి యున్నారయా ,,
దేవతలు రాక్షసులు యక్షులును సిద్ధులు
పార్థుకంటికి గోచరించారయా ,,
పదునుతీరిన ఆయుధాలెన్నో చేతుల్లో
భీకరమ్ముగ నిండియున్నాయయా ,,

కథ: ఇలావున్న విశ్వరూపాన్ని సందర్శించినపిమ్మట అర్జునుడు కృష్ణపరమాత్మతో యేమన్నాడయ్యా:

వందనమయ్యా మహానుభావా వందనమ్ము నీకు గీ॥
ప్రత్యక్షముగా చూచితినీదగు మహాత్మ్యమ్ము నిపుడు ,,
నీ నేత్రమ్ములు భయంకరముగా నిప్పులగక్కుచుండె ,,
నీ రూపానికి లోకాలన్నియు వణకిపోవుచుండె ,,
మరియొకవింతను గూడా నీలో చూచుచుంటినయ్యా ,,
ప్రస్తుత సంగరరంగమంతయును గానవచ్చుచుండె ,,
భీష్ముడు ద్రోణుడు కర్ణుడు మరియును సుయోధన్ను మొదలవ్,,
కౌరవపక్షపు ముఖ్యులెల్లరును ఆహుతియగుచుండె ,,

హాస్యం: అబ్బా! అవన్నీ కూడా కనిపించాయన్నమాట.

కథ: ఆ. ఫల్గునుడింకా శ్రీకృష్ణునితో యేమంటున్నాడయ్యా:

ఓ శ్రీకృష్ణామహాదేవా సై॥
నీ ప్రభావమది పూర్తిగా ,,
తెల్సికొంటినేనిప్పుడు ,,
శాశ్వతమూర్తివి నీవయా ,,
సర్వస్వమ్మును నీవయా ,,
బ్రహ్మాండంబు సంతటా ,,

నిండెను నీదగురూపము సై॥
యిక యీ భీకర తేజమున్ ,,
చూచుసమర్ధత లేదయా ,,
శంఖచక్రముల తోడను ,,
మామూల్ రూపు ధరించియె ,,
దర్శనమిమ్మా నాకికన్ ,,
యిన్నాళ్లకు నీ రూపమున్ ,,
గాంచితరించెను జన్మము ,,

కథ : అంతట కృష్ణభగవానుడు విశ్వరూపాన్ని విడిచిపెట్టి శాంత రూపంతో అర్జునునికి దర్శనమిచ్చి యిలా అన్నాడు.

పార్ధవినుమా నాదుచరితాన్ని నీవు
పొందగలవోయ్ ముక్తి మార్గాన్ని
యే లోకమున నెవ్వరైననూ పార్ధ
విశ్వరూపము చూడగాలేరోయ్ పా॥
పూర్వజన్మపు సుకృతముచేతన్ నీవు
దర్శించితివి నాదురూపాన్ని ,,
కురువృద్ధ వీరుల్ని హతమార్చన్ నాకు
శక్తిలేదని యెంచబోకయ్యా ,,
వారలందర నేను యేనాడో పార్ధ
పతనమొనర్చాను వినవయ్యా ,,

కథ : అనిచెపుతూ "అర్జునా! సమస్తానికీ మూలకారకుడ్ని నేనేకాని నీవు కావు. నిమిత్తమాత్రుడవుగావుండి నీవు యుద్ధంచెయ్యి. తప్పకుండా జయం సత్కీర్తి లభిస్తాయి" అన్నాడు. ఇదే విశ్వరూప సందర్శనయోగం. దీనితర్వాత కృష్ణభగవానుడు భక్తియోగాన్ని వివరించాడు. యెలాగయ్యా:

భక్తియోగమును తెలిపెదవినుమా పార్ధా నీకిపుడు గీ॥
నా భక్తులలో రెండు తెగలవారుండిరి తెలియుమయా ,,

నారూపమ్మును ధ్యానముచేసెడివార లొక్క జాతి గీ॥
కానరానిదను ప్రార్థనచేతురు రెండవతెగవారు ,,
మొదటివారలను సహాకారోపాసకులని యంటారు ,,
రెండవజాతియె నిరాకారపు ఉపాసకులు పార్థా ,,
పోతే నాదగుభక్తుల గుణములు యెట్లుండాలంటే ,,
కష్టసుఖాలను సమభావముతో స్వీకరించవలెను ,,
కామక్రోధముల సంపూర్ణముగా విడనాడాలయ్యా ,,
దూషణమ్ములను భూషణమ్ములను లెక్కచేయరాదు ,,
ప్రాణికోటి నతి సానుభూతితో ఆదరించవలయు ,,
శరీరమ్మునూ మనసును వశమున నుంచుకొనగవలెను ,,
వాడు శత్రువని వీడు మిత్రుడని యెంచకూడదయ్యా ,,
యిట్టివారలే నిర్మలభక్తులు యెరుగుమోయిపార్థా ,,

కథ: ఈవిధంగా భక్తియోగాన్ని తెలిపాడు. తర్వాత క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగాన్ని వివరిస్తున్నాడు కృష్ణపరమాత్మ:

క్షేత్రమన్నను జన్మక్షేత్రజ్ఞుడను నేను
క్షేత్రల నాత్మనై యుంటానయా శ్రీ॥
జన్మమ్ముతో నన్ను విడదీయునట్టిదియె
జ్ఞానమ్మనుచు నీవు తెలియాలయా ,,
బ్రహ్మసూత్రాలందు ఆమ్నాయభావాలు
వివరమ్ముగానుండి యున్నాయయా ,,
అవియేమిటన్నచో నిప్పుమరి నీరునూ
భూదేవియును గాలిగగనమ్మును ,,
మాయయును క్రోధమ్ము ఇంద్రియాల్ మనసును
విషయమ్ములాశలును ద్వేషాదులే ,,
వీటితో జతగూడి సుఖదుఃఖమయమైన
దే క్షేత్రమనబడున్ ఓ అర్జునా ,,

యీావికారాలేవిలేకుండ నిర్వికా
రమ్ముగా నుండు క్షేత్రజ్ఞుడు ,,
క్షేత్రజ్ఞుగురియించి తెలియవలెనంటేను
జ్ఞానాంగములు కొన్ని కావాలయా ,,
ధైర్యమ్ము స్థయిర్యము ఓర్పుయును నిర్మలత
శాంతగుణములు ముఖ్యవిషయాలయా ,,
కల్లకపటాలకును స్వస్తివాక్యముపలికి
స్వాతిశయమును మర్చిపోవాలయా ,,
కామమ్ము క్రోధమ్మును లోభమ్ము మోహము
మచ్చుకైనను వుంచుకోరాదయా ,,
విషయవాంఛలయుందు సుఖదుఃఖదోషాలు
యుండుటచే వాటినే విడవాలయా
ఈ సద్గుణాలన్ని అలవాటు చేసుకొని
ఆత్మతత్వము తెల్సుకోవాలయా ,,
అప్పుడే యెవరైన యే కష్టములు లేక
తేలికగ నాచెంత కొస్తారయా ,,

క : ఆత్మతత్వమంటే యెలాంటిదని చెప్పాడోయ్ కృష్ణభగవానుడు:

ప్రత్యేకముగా కానుపించెడి – భూతమ్ములలోన గీ॥
ఆత్మమాత్రమది ఒక్కటెయనుచును–గ్రహియించుముపార్థా,,
దీనినె నానాత్వములో నేక–త్వమ్మని చెప్పెదరు ,,
ఆత్మమూలమునె విశ్వంబంతయు– సృష్టియగునటంచు ,,
తెలియుటె ఏకత్వమున నానా–త్వమ్మని తెలియాలోయ్ ,,
ప్రతీప్రాణిలో తప్పనిసరిగా – ఆత్మయున్నదోయీ ,,
అందువలనె నను క్షేత్రజ్ఞుండని – పలుకుదురెల్లరును ,,

హాస్యం : క్షేత్రా క్షేత్రజ్ఞ విభాగయోగం పూర్తి అయినట్టేనా ?

క : ఆ తర్వాత శ్రీకృష్ణుడు అర్జునునికి చెప్పబోయేది గుణత్రయవిభాగయోగం.

మూడుగుణాలతో కూడిన సై॥
మాయయె లోకపుమాతయా ,,
అయితే బీజముదా౽డి ,,
తండ్రిని నేనని నమ్మము ,,
నేనొనరించెడి సృష్టిలో ,,
భేదాలెందులకన్నను ,,
చెప్పెదవినుమా శ్రద్ధగా ,,
ప్రకృతివల్లను పుట్టెడి ,,
త్రిగుణమ్ములె యీ నరులను ,,
బంధిస్తాయని తెలియుము ,,
వాటిలో సత్వగుణమ్ముచే ,,
సౌఖ్యము జ్ఞానము కల్గును ,,
బ్రహ్మపదమ్ము దొరకును ,,
యింక రజోగుణముంటచే ,,
యింద్రియవాంఛలు కల్గును ,,
దానిమూలమునె జన్మముల్ ,,
కలుగుచునుండును భూమిపై ,,
యిక అవివేకము మోహమున్ ,,
జడితనాలే యున్నది ,,
ధరణి తమోగుణమనబడున్ ,,
దానివలననే నీచములైన ,,
పుట్టుకలన్నియు వచ్చుచుండును ,,
కావున యీ గుణత్రయమునకు ,,
లొంగకయుండిన మానవుడు ,,
తప్పక ముక్తిని పొందును ,,

హాస్యం : ఇప్పటికి వచ్చిచెడి పద్నాలుగుయోగాలు చెప్పారన్నమాట మీరు.

క : అ. పద్నాలుగయ్యాయి పదిహేనవది పురుషోత్తమ ప్రాప్తియోగం.



రావిచెట్టుతో సంసారమ్మును పోల్చి విభాగించి గీ॥
నాస్థితి తెలియుము అతిజాగ్రత్తగ ధనంజయా నీవు ,,
రావిచెట్టునకుగల పత్రమ్ములె వేదమ్ములుసుమ్మ ,,
దానిమూలమె బ్రహ్మమనంబడు జడవేలోకములు ,,
వైరాగ్యముతో చెట్టునునరికిన ముక్తిపదము దొరకు,,
యెవ్వరుకూడా తిరిగి దానిని బాగుచేయ లేరు ,,
అందువల్లనే పరంధాముడని పిలువబడెద నేను ,,
అయితే కర్మలమూలమ్ములనే దేహమొచ్చెగాన ,,
దేహముతోడనె కర్మ నాశనంబందునందువేమొ ,,
అట్లుకాదయా సూక్ష్మదేహమున కర్మగుణములంటున్ ,,
సూక్ష్మదేహమది యెప్పుడుకూడ తనువునంటియుండు ,,
సర్వము నేనేనను నామాటను కడకు మరువకయ్య ,,

కథ : యిలా బోధించిన తర్వాత దైవాసురసంపద్విభాగయోగంలో యేమన్నాడయ్యా శ్రీకృష్ణుడు :

గీతాసారము విన్నను
పాపపరంపర లంటవు
యీలోకమ్మున మనుజులు గీ॥
సమముగ పుట్టెదరయినను ,,
వారిలో సద్గుణవంతులే ,,
సురలుగ పేర్కొనబడుదురు ,,
సద్గుణమ్ము లేవన్నను ,,
భూతదయయు మరిశాంతమూ ,,
సత్యమహింసయు త్యాగము ,,
దాన నిరతియును ధైర్యము ,,
ఇంద్రియ నిగ్రహణమ్మును ,,
యీపై గుణములు తప్పక ,,
సురలందరకును యుండును ,,

హాస్యం: భేష్! బాగా సెలవిచ్చారు. కాని అసురుల గుణాలేమిటో కాస్త వినిపిద్దూ.

కథ: అదికూడా శ్రీకృష్ణభగవానుడే వినిపిస్తున్నాడు విను:

మచ్చునకైనను దయలేకుండగ క్రూరబుద్ధిగలిగి గీ॥
యితరుల నెప్పుడు పీడించుటకై యత్నిస్తారయ్యా ,,
అవివేకముతో మంచిచెడ్డలను అసలు కానలేరు ,,
నాస్తికత్వమును ప్రపంచమందున ప్రచురించుతారు ,,
పరులయున్నతికి ఓర్వలేక యే లోలో కుమిలెదరు ,,
యీ రాక్షసులే యెన్నోజన్మము లెత్తుచు నిత్యమ్ము ,,
పాపపంకిలములో బడి బాధల ననుభవించుచుంద్రు ,,

క: అనంతరం శ్రద్ధాత్రయ విభాగయోగాన్ని తెలిపాడు కృష్ణభగవానుడు.

హాస్యం: ఊఁ. చెప్పండి చప్పున

శ్రద్ధయున్నదియున్న శాస్త్రాల జ్ఞానమ్ము
ముక్తికాటంకమ్ము కాబోదయా శ్ర॥
యీ శ్రద్ధలోకూడా మూడురకములుకలవు
జాగ్రత్తగా నీవు గుర్తించవయా ,,
సాత్వికము రాజసము తామసంబని యేటి
రకములే యివియంచు తెలియాలయా ,,
మొదటితరగతివారు శ్రద్ధతోడనె యెపుడు
దేవతా పూజ లొనరిస్తారయా ,,
యక్షాదిగణములను రాజసులుగొల్తురు
యింక మిగిలినవారలు ,,
ప్రేతాలభూతాల కొలుచుతుంటారయా
శ్రద్ధమీరగ యెప్పుడూ ,,

కథ: "అర్జునా! వీళ్లు తినే ఆహారంలోనూ చేసే పూజల్లోనూకూడా భేదాలున్నాయి. సాత్వికులు ఆరోగ్యకరమైన ఆహారమూ, రాజసులు రోగకారకమైన ఆహారమూ; తామసులు కుళ్ళిన ఆహారమూ తింటారు. మొదటివారు దైవాన్నీ, గురువునీ, బ్రాహ్మణుని పూజిస్తారు. మంచి గుణాలు కలిగి

ప్రవర్తిస్తారు. ఇక రాజసులు తోటివారిలో మెప్పుకోసం తపస్సు చేస్తారు. పోతే రాజసులు యితరుల్ని బాధపెట్టే తపం సాగిస్తారు" అని చెపుతూ కృష్ణభగవానుడు దానాలలోగల తేడాలుకూడా చెప్పి శ్రద్ధాత్రయ విభాగ యోగాన్ని ముగించి మోక్షసన్యాసయోగాన్ని గురించి యిలా చెప్పాడు :

మానవులెవ్వరు కర్మలుచేయక మిన్నకుండలేరు గీ॥
కర్మలొనర్చుచు ఫలితమువదలుటె త్యాగమోయిపార్థా,,
బ్రాహ్మణధర్మం తపోనిష్టయును జ్ఞానార్జనమయ్యా ,,
క్షత్రియధర్మం సంగరమందున జంకకుండుటేను ,,
వైశ్యుల ధర్మం వాణిజ్యముతో గడపుచుండుటేను ,,
పోతే శూద్రులు ప్రజలందరకును సేవచేయవలయు ,,
క్షత్రియుండవే కావున నీదగు ధర్మము యుద్ధంబే ,,
ఫలితమ్మునకై ఆశ చెందకయె నన్ను శరణువేడి ,,
యుద్ధముచేయగ లెమ్మా! రమ్మా! జాగుచేయకుండా,,
నిశ్చయమ్ముగా నన్నే నమ్మిన నీకు ముక్తి నిత్తున్ ,,

కథ : అంటూ తన గీతోపదేశాన్ని ముగించాడు శ్రీకృష్ణభగవానుడు. అంతట ఫల్గునుడు కృష్ణభగవానునికి నమస్కరించి "మహానుభావా! నీ ఉపదేశంవల్ల నా సందేహాలన్నీ తొలగిపోయాయి. యిక నీ ఆజ్ఞప్రకారమే యుద్ధం చేస్తాను" అనిచెప్పి తిరిగి గాండీవాన్ని ధరించి యుద్ధానికి లేచాడు. కృష్ణపరమాత్మ స్వయంగా ఉపదేశించిన యీ గీతను చదివినా, విన్నా పాపాలు తొలగిపోతాయని పెద్దలభావం.

హాస్యం : అమ్మయ్యా! ఇక పోదామా ?

కథ : పోదాంపదరా నాయనా! నీగొడవ యెక్కువగా వుంది.

పరమపావనికి భారతమాతకు జేజేలనుడయ్యా.

సమాప్తము.

శ్రీ రాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి.

# నూతన
# బుఱ్ఱకథలు

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రకేసరిప్రకాశం | 0–37 | రామాంజనేయయుద్ధం | 0–37 |
| శ్రీకృష్ణరాయభారం | 0–37 | పొట్టిశ్రీరాములు | 0–37 |
| గయోపాఖ్యానం | 0–37 | కష్టజీవి | 0–37 |
| పల్నాటియుద్ధం | 0–37 | విద్యార్థి | 0–37 |
| సీతారామరాజు | 0–37 | జైప్రకాశ్ నారాయణ్ | 0–25 |
| వీరబ్రహ్మం | 0–37 | హిందూస్థాన్ స్కౌట్ | 0–25 |
| హరిశ్చంద్ర | 0–37 | డాక్టర్ కోట్నీస్ | 0–25 |
| రుద్రమదేవి | 0–37 | గాంధీజీ హత్య | 0–25 |
| వీరాభిమన్యు | 0–37 | సర్దార్ పటేల్ | 0–25 |
| ఝాన్సీరాణి | 0–37 | నేతాజీ–బోస్ | 0–25 |
| వీరబొబ్బిలి | 0–37 | కొల్లేటిరైతు | 0–25 |
| కురుక్షేత్రం | 0–37 | బాపూజీ | 0–25 |
| భగవద్గీత | 0–37 | నెహ్రూ | 0–25 |
| శివాజీ | 0–37 | రాజాజీ | 0–25 |

అడ్వాన్సు లేని ఆర్డరు అంగీకరించబడదు.

దొరకుచోటు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,

సంస్కృతాంధ్ర బుక్ డిపో (స్థా.1882) రాజమండ్రి.

రామేశ్వర ప్రెస్, రాజమండ్రి.

